# ఖడ్గ సృష్టి

శ్రీ శ్రీ

రెండు రెళ్ళు నాలుగన్నందుకు
గూండాలు గంద్రాళ్ళు ◌సిరే సీమలో
క్షేమం అం◌భాజ్యం అంటే
జైళ్ళు నోళ్ళు తెరిచే భూ◌ులో

అసతంత్రతని జయించడానికి
అహింసాయుధం ధరించామంటూ
రక్తపాతం లేకుండానే
రాజ్యం సంపాదించామంటూ

అం◌నీతి భారీ పరిశ్రమలో
అన్యాయాల ధరలు పెంచేసి
సొతంత్ర్యాన్ని బ్యాంకుల్లో వేసుకుని
చక్రవడ్డీ తిప్పే కామందులకు

క్షణ క్షణం మారుతున్న లోకాన్ని
సరిగా అర్థంచేసుకున్న వాళ్ళంతా
పేద ప్రజల పక్షం వహించడమే
పెద్ద అపరాధమై పోయింది.

అహింస ఒక ఆశయమే కాని
ఆయుధం ఎప్పుడూ కాదు
ఆశయం సాధించాలటే
ఆయుధం అవసరమే మరి.

ఆశయం ఉండడం మంచిదే కాని
అన్ని ఆశయాలూ మంచి◌ కావు
ఆశయాలు సంఘర్షించే వేళ
ఆయుధం అలీనం కాదు.

అందుకే అంటున్నాను నేను
అందుకో ఆయుధం అని

ఆచరణకి దారితీస్తేనే
ఆవేశం సార్థకమవుతుంది.

అందుకే సృష్టిస్తున్నాను
అధర్మనిధనంచేసే ఈ ఖడ్గాన్ని
కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది
జనంతో నిర్మిస్తున్న సర్గం ఇది

ఈ కత్తి
బూజు పట్టిన భావాలకి
పునర్జయం ఇవడానికి కాదు
కుళ్ళిపోతున్న సమాజవృక్షా న్ని
సమూలచ్ఛేదం చెయ్యడానికి

దీన్ని
నల్లబజారు గుండెల్లో దించు
దీనితో
కల్లకపటాలను వధించు

ఇది
సమాన ధర్మాన్ని స్థాపింస్తుంది
న◌ిన మార్గాన్ని చూపిస్తుంది

ఈ కత్తి
ఊహాసమూహాల వ్యూహాలు పన్ని
◌ిర◌హారం చేస్తూ
రణక్షోణిలో
జనాక్షౌహిణులు కదలడానికి

అందుకే రాస్తున్నా నొకగీతి
చేస్తున్నా నొక గేతి
రావోయి లోనికి
సందేహం దేనికి ?

ఇది నిజం
నవధర్మం మానవధర్మం

అణుశక్తి కన్న
మానవశక్తి ◌ున్న

రావోయి రావోయి లోనికి
సంకోచం దేనికి
నను చూడగా ఇదేవేళ
నా మన: కార్మికశాల

క్రక్కేది భావాగ్ని సెగలు
క్రమ్మేది దావాగ్ని పొగలు

రావోయి రావోయి లోనికి
రాసేది రవ్యుష్ణ గీతి
చేసేది పవ్యుగ్ర హేతి

## శరచ్చంద్రిక

న◌ీన ◌శ◌ద్యాలయాల్లో
పురాణ క◌తంలాగా
శ్రవణ యంత్రశాలల్లో
శాస్త్రీయ సంగీతం లాగా
ఇలా వచ్చేవేం వెన్నెలా?
ఎలా వర్ణించను నిన్ను ?
మహా కవులు లోగడ చెప్పిందే
మళ్ళీ మళ్ళీ చెప్పాలా ?

ఏదో కాస్త భాషా జ్ఞానం
ఇంతో అంతో చ్ఛందస్సంపదా
ఐదో పదో అలంకారాలు
ఆరో , అందులో సగం ఆవేశం

ఇలాంటి◌ ఏవో పోగుచేసి
ఇదివరకు నిన్నెప్పుడూ చూడనట్టు
ఇవాళే కొత్తగా కనిపెట్టినట్టు
ఏమని వర్ణించను నిన్ను ?

ఏది రాసినా ఏం లాభం?
ఇదివర కెవడో అనే వుంటాడు
బహుశా ఆ అన్నదేదో నాకన్నా
బాగానే వుండొచ్చు.

అలాంటప్పుడు మళ్లీ
కలం కాగితం ీంద పెట్టి
కళంకం లేని తెల్లదనాన్ని
ఖరాయి చెయ్యడ మెందుకు ?

అనాదీ నుంచీ నువ్వు
అంత మంది కవులకీ
ఉపాదేయ వస్తువుగా నిలిచి
ఉపకారం చేశావు

అలాగే నేనూ ఒకప్పుడు
రొమాంటిక్ ప్రమాదంలో పడి
అమాయకంగా నీ బ్యూటీ
అభివర్ణించాను వృత్తాలలో

ఇవాళ మళ్ళీ అలాగ
ఎలాగ రాయగలను నేస్తం ?
ఇరవయ్యో ఏడు నాకు మళ్ళీ
ఎలా వస్తుంది చెప్పూ ?

అంచేత నీ గురించి
అనవసరవేశాలు పెంచి
అన్యాపదేశంగానో లేదా
అర్థాంతరన్యాసంగానో

సొంత కోపాలేవో పెట్టుకుని
పంతాలూ పట్టింపులూ పట్టుకుని
ఎవరినీ ఈ వ్యవహారంలో
ఇరికించదలచుకోను నేను

ఇంతకీ ఆవేశాల కేముంది ?
ఎవడి బతుకు వాడు బతుకుతున్నాడు

ఎంతగా ఎడం ఎడంగా ఉన్నా
ఎంతగా పైపై భేదాలున్నా
ఎంతగా సాతిశయం పెరిగినా
ఎంత బలం ధనం జనం పెరిగినా
అంతరంగం అట్టడుగున మాత్రం
అంతమందిఁ మానవులమే!

అందుచేత ఓ చందమామా !
అందమైన ఓ పూర్ణ సోమా!
సముద్రం ఁదా అరణ్యం ఁదా
సమానంగా ప్రకాశించే సౌందర్యాభిరామా !

(అదిగో మళ్ళీ కంతం -
అనుకున్నాను మొదటే నేను
వెన్నెల -పేరెత్తితే చాలు
వెర్రెత్తిపోయింది మనస్సు)

అన్నట్టి ఏఁటి చెప్మా
అందామని అనుకున్నాను
ఏఁలేదు ; ఏఁ లేదనే
ఇంతసేపూ చెబుతున్నాను.

చెప్పొంచిదేఁటంటే
చెప్పడాని కేఁ లేదని ;
అంతమందికీ అన్నీ తెలుసు
అదే మన అజ్ఞానం

ఎవడో చెబితే ంనే రోజులు
ఏనాడో వెళ్ళిపోయాయి
ఇంకా ఏదో చెప్పాలని
ఎందుకీ ఉబలాటం ?

అసలు నిజం ఏఁటంటే
ఎవడికీ ఏఁ తెలియదు
ఇలా ఎందుకొచ్చామో
ఇక్కడెంత సేపుంటామో

ఇక్కడినుంచి వెళ్ళేదెక్కడికో
ఎల్లుండి ఏ తమాషా జరుగుతుందో
ఎవడూ చెప్పలేడంటే నమ్మండి
చెబితే మాత్రం నమ్మకండి !

కాళ్ళక్రింద భూ◌ి
కరిగిపోతున్నప్పుడు
పూరంవేసిన పునాదులు
కదిలిపోతున్నప్పుడు
మనిషికీ మనిషికీ మధ్య
మాయపొరలు కప్పినప్పుడు
మనసుకీ మనసుకీ మధ్య
మంచు తెరలు క◌్మనప్పుడు

ఏ నక్షత్రానికి తగిలించాలి
ఈ మన ◌షాద శకటాన్ని ?
ఎవరు మళ్ళీ అతుకుతారు
ఈ ◌రిగిన జీ◌త శకలాల్ని ?

అంతా అగమ్యగోచరం
అంతా అరణ్య రోదనం
దేషం ఇచ్చే పర్సెంటేజీ
ప్రేమ ఎలా ఇవగలదు ?

కష్టపడి అర్జించిన సాతంత్ర్యం
గద్దలు తన్నుకుపోతాయి
కంచిమేక పాపం ఎప్పుడూ
కసాయివాణ్ణే నమ్ముకుంటుంది.

ఇంతకీ ఈ భూ◌ికి
ఏమాత్రం ఈడొచ్చిందని ?
సగటు మానవుడి వయస్సు
పదకొండో, పన్నెండో !

ఈ కుర్రాళ్ళని చూసి
ఏందుకలా నవ్వుకుంటావు

మబ్బుతునక జేబురుమాలు
మాటు చేసుకుని, జాబిల్లీ !

మానవుడు పెరుగుతున్నాడు
పరిసరాల నర్థం చేసుకుంటున్నాడు
ప్రకృతి శక్తులను జయిస్తూ
ఘన◌ంజయాలు సాధిస్తున్నాడు.

ఏదో నిరాశగా నేను
ఇంతసేపూ వాగాను కదూ?
ఇంకో వేపునుంచి చూస్తే
ఎంత వెలుగు కనబడుతుందో ?

ఏమో బహుశా తరలో
ీ ఇంటికే రావచ్చు మేము
సాగతం ఇస్తావు కదూ
ఆతిథ్యాని కర్తులమే మేము

చంద్రమండలానికి ప్రయాణం
సాధించరాని సప్నంకాదు
గాలికన్న బరువైన వస్తువుని
నేలీద పడకుండా నిలబెట్టలేదూ ?

పరమాణువు గర్భంలోని
పరమ రహస్యాలూ
మహాకాశ వాతావరణంలోని
మర్మాలూ తెలుసుకున్నాక

సరాసరి నీదగ్గరకే
ఖరారుగా వస్తాంలే
అప్పుడు మా రాయబారుల్ని
ఆదరిస్తావు కదూ నువు ?

చిరకాలం అజేయంగావున్న
ఎవరెస్టు ఇటీవలే లొంగింది
చికిత్స లేదనుకున్న వ్యాధులు
చిత్తగిస్తున్నాయి పరారీ

పదార్థ ◌జ్ఞానశాస్త్రం
అమోఘంగా ◌కసిస్తోంది
ప్రాణం సభావం ఏ◌ంటో
పరిశోధనలు సాగుతున్నాయి

మహానదుల గమనాలను
మళ్ళించ గలుగుతున్నాం
ఉత్తర ధ్రువంలో వ్యవసాయం
ఒకప్పుడు జరిగి తీరుతుంది.

సంహారం సంగ్రామం అంటే
జనంలో అసహ్యం పుట్టింది
ప్రశాంతంగా జీ◌ంచాలని
ప్రజలంతా ఆశిస్తున్నారు.

ఇదీ మా భూలోకం కథ
ఇదీ మానవుడు Progress Report
ఇందులో అతిశయోక్తు లే◌ం లేవని
ఎవరైనా ఒప్పుకుంటా రనుకుంటా.



అంతా బాగానేవుందని
అంతా సుఖంగానే ఉన్నారని
అన్నానంటే మాత్రం అది
అబద్ధమే అవుతుంది.

జనాభాలెక్కలు నాకు
సరీగా తెలియవుగాని
దరిద్రాల శాతం ఇంకా
చిరాకు కలిగిస్తూనే ఉంది.

ప్రపంచం మొత్తం◌ద
భయం పెత్తనం చేస్తోంది
ఇరుగువాడు పొరుగువాణ్ణి చూసి
ఎందుకో బెదిరిపోతున్నాడు.

ఇక్కడ మా భారత వర్షంలో
ఎక్కువగా కబుర్లేగాని

సమాజ సరూపం మార్చే
సాహసం కనిపించకుండా వుంది.

మొన్ననే ఆంధ్రరాష్ట్రం
పుట్టినరోజు పండుగ చేసుకుంది
పన్నెండు నెలల అభ్యుదయం
పర్యాలోకనం చేసుకొంది.

ఏడాదిలో ఏమవుతుంది
ఇంకా కొన్నాళ్ళాగమంది
చెల్లాచెదలైన తెలుగువారంతా
తెల్లబోయి చూశారు !

ఇవన్నీ చెప్పకుంటూ
ఎందుకు నిన్ను ◌సిగించడం శశీ!
ఇప్పటికే ఆలస్యమయింది
ఇంతటితో ◌ర◌ించినా ?

చంద్రునికో నూలుపోగన్న
సామెత వుండనే వుంది
తీసుకో ఈ దారంలాంటి
తేలికైన గీతాన్ని.

ఇంతకుముందే చెప్పానుగా
ఏ◌ు పెగల్లేదని --
ఇలాంటివెన్నో నువు
ఇదివరకు ◌నే వుంటావు.

శరత్కాల గగనంలో
చందమామ కనిపిస్తే
సరదాగా కొంతసేపు
సంభాషణ సాగించా.

సంతాపం కొంతసేపు
సంతోషం కొంతసేపు
సాగించిన సంభాషణలో
సారాంశం మరేముంది ?

ప్రసంగవశాత్తూ ఏ
పగల్భాలు పలికానో
అసందర్భమైనా ఏ
అడ్డదారి తొక్కానో

వెనుక తిరిగి చూసుకొనే
అలవాటే లేదు నాకు
అరని◌ుషం దాటేసరి
కదే నాకు గత శతాబ్ది.

కావున ఓ జాబిల్లీ !
రాబోయే యుగంలో
కాలక్షేపం చేద్దాం
కలుస్తావుగా మళ్ళీ ?

అప్పుడు బహుశా నాలో
అరాజకం పోతుందనుకుంటా
ఇప్పుడు బాధిస్తూన్న
హృదయవేదన లుండవనుకుంటా

శాఖా చంక్రమణం మాని
చెప్పేదేదో సూటిగా
బల్ల గుద్దిన మాదిరిగ
కుండ బద్దలు కొట్టిన బావతుగా

ఈ నీళ్ళు నమలడం లేకుండా
ఈ కాళ్ళు తడబడడం లేకుండా
స్పష్టంగానే కాకుండా శ్రావ్యంగా
సచ్ఛంగానే కాకుండా సమగ్రంగా
రాబోయే యుగంలో

గుండెలు ◌ప్పి మాటాడుకుందాం
◌నహాయింపులు లేని క్షమాపణలులేని
సౌందర్యవంతమైన ఆ సర్ణయుగంలో

ఎంచేతనంటే భ◌ష్యత్తు◌ందే
ఎప్పుడూ నా నిఘా వుంటుంది

ఇవాళకంటే రేపే
ఎంతో బాగుంటుందంటాను నేను.

వెళ్ళు జాబిల్లీ వెళ్ళు
కవులను కదిలించడం అంటే
కాలం డొంకంతా అమాంతంగా
కదిలించడమే అవుతుంది.

సయంగా నీతో మాట్లాడి
చాలా కాలమయింది
అందుకే అవ్యక్తంగా అయినా
ఆప్యాయంగా మాట్లాడుతున్నాం.

ఎలాగైనా నువు మాకు
ఏకరక్త బంధువుడి◌
నీతో కాకపోతే ఎవరితో
మా ఘోషలు చెప్పుకోవాలి ?

వెళ్ళు జాబిల్లీ వెళ్ళు
◌నిర్మలమైన నీ వెన్నెల కురిపిస్తూ
మనోహరమైన సంగీతం ◌నిపిస్తూ
ప్రయాణించు శశీ ప్రయాణించు.

ఇదిగో మాట! ఈ ప్రపంచంలో
ఇంకా ఎందరో అభాగ్యులున్నారు
పలకరించు వాళ్ళని చల్లగా
ధైర్యంచెప్పు వాళ్ళకి మెల్లిగా

ఆసుపత్రి కిటికీల్లోంచి నీ
కిరణాలను జాలుగా పంపించి
వ్యాధిగ్రస్థుల పాలిపోయిన కపోలాలను
జాలిగా స్పృశించడం మరచిపోకు.

జైళ్ళలో వున్నారు కొందరు
వాళ్ళని ఓదార్చక తప్పదు సుమా
నేరాలు చేశారు నిజమే
అందుకని అలక్ష్యంగా చూడకేం!

మురికి గుడిసెల్లో నివసించే
పరమ దరిద్రుల నుదుటి ◌ిద
ఏ కన్నంలోంచో జాగా చేసుకుని
ఎలాగైనా పరామర్శ చేస్తావు కదూ ?

ఇదిగో జాబిల్లీ నువు
సముద్రం ◌ిద సంతకం చేసేటప్పుడు
గాలి దాన్ని చెరిపెయ్యకుండా
కాలమే కాపలా కాస్తుందిలే.

## ◌షాదాంధ్ర

బాకాలు లాభం లేదు బాజాలు లాభంలేదు
ఎంత ఈదినా ఏం ఫాయిదా ఎక్కడా తీరం కనపడదు
తల మాత్రం ◌ిదికుంచి నిలు◌ిత ఈదుతున్నాం
గమనం పిసరూ లేదు గమ్యం అసలే లేదు

పట్టాభిరావ సా◌ిమ్మద ప్రమాణంచేసి చెబుతున్నా
అంతా గజీతగాళ్ళే మళ్ళీ అరగంట పురోగమనం లేదు
ఆదర్శప్రాయంగా అభినయిస్తున్నాం అయినా ఎవరూ మనల్ని చూడ్రు

అరుస్తున్నాం గొంతు చించుకుని అయినా ఎవరూ ◌న్రు

మనలో కొంతమంది కవులు మధురంగా ◌శసిస్తారు
యతిప్రాసలు సరిపోతాయి పదాలు మజాగా పడతాయి
పౌరుషానికి లోటులేదు ప్రశస్తికి కూడా డిటో
పద్యాలకు పళ్ళు రాలవు చింతకాయలు చెట్టు ◌ిదే వున్నాయి

ఈ గొంగళీ వయస్సు ఇరవై అయిదేళ్ళు
ఇంకా ఎక్కువే అనుకో ఎవడు చూశాడు లెక్కలు
తీర్మానాలూ ఉపవాసాలూ చేశాం ఖద్దరూ కేకలూ వేశాం
మొసుకొచ్చాం సరాజ్యమ్మూట మూట ◌ప్పితే ఏ◌ిలేదు

అర◌ిందఘోష్టు ఆశీరదించాడు కదా
ము◌ిమ్మడివరం బాలయోగి ఏమంటాడో

ఆంజనేయదండకం వల్లిస్తేనో
అన్నట్టు సాయిబాబాకి మొక్కుకోకూడదూ

మహారణ్యంలో మధ్యాహ్నంలాగ ఒక స్తబ్దత నిశ్శబ్దత
రాత్రిపూట వేట ముగించుకొని క్రూరమృగాలు నిద్రిస్తున్నాయి
చిల్లరజంతువులు భయంతో ఎక్కడివక్కడ ఇరుక్కుపోయాయి
ఎప్పుడైనా ఒక పక్షి ఎగిరితే ఎక్కడో ఒక ఆకురాలి చప్పుడు

శిశువుకి దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరి నీళ్ళు
బద్దలైన గుండెల్లాగా బీటలు వేశాయి పొలాలు
మన పరిశ్రమలు ప్రణాళికల్లోనే మన ప్రతిభ చాకిరీకి తాకట్టు
మనకో ఇల్లంటూ లేదు రచ్చకెక్కి రాద్ధాంతాలు

కొంగల్లారా జపం చెయ్యండి పిల్లీ పఠించు మంత్రాలు
ఎలకల్లారా సభ జరపండి ఎవరు గంటకట్టాలని
ఇంకోమారు ఎగరవేనక్కా ఈ సారి అందవచ్చు ద్రాక్షపళ్ళు
కోతీ తీసుకురా త్రాసు పంపకం తెగడం లేదు.

ిశాలాంధ్రలో ప్రజారాజ్యం

శక్తికోసమేనడు :
ముక్తికోసమేమను : ిముక్తికోసమేమను :
ిశశాంతిక్రాంతికోసమే మనస్సులేకమై,
నడూనడూ : భయంగియం ిడూ :

వేగుచుక్కవెలిగెింటిపై
వెలుగురేఖలిగొకంటివా :
ఉదయమెంతోలేదు దూరము
వదిలిపోవుసంధకారము

జీితాశలే
భాిజాడలోయ్
ప్రపంచశాంతిశాంతి కాంతి బాటసారివై// నడూ నడూ//

ిరోధించువారులేరులే
నిరోధించువారురారులే

ఆస్తినాస్తి భేదమేలరా?
వాస్తవంవరించి సాగరా :

◌శాలాంధ్రలో
ప్రజారాజ్యమే
ఘటించగాశ్ర◌ంచరా పరాక్ర◌ంచరా: //నడూ నడూ//

## మున్నుడి

చెవులు◌ప్పి మనసు ◌ప్పి
కనులు◌చ్చి ◌నవయ్యా

కేథలిక్కు కెన్నెడీ
బోల్షి◌క్కు మున్నుడి

అరుపులిచ్చి కరువు తెచ్చి
ఋణంపెట్టి రణం తెచ్చి
జనంధనం ఇంధనమై
చరణకరాబంధనమై

జనన జరా మరణదురా
శ్రమణల సంగ్రంథనమై

ఒకనాడోహో అని పిం
చుకతిరిగిన ధనిక వాద
◌కపైవెగటై జిగటై

మరణంలో మశౌతుంది

◌నవయ్యాకెన్నడీ
◌శాలంధ్రమున్నుడి

కేథలిక్కుకెన్నెడీ
జీ◌తమేనిన్నది

భావములేమొన్న◌
క్యూబా ఏమన్నది
లావోస్ ఏమన్నది
కాంగో నిలుచున్నది

ఐసన్‌హోవర్ చేసిన
మోసంతాలూకు అసలు
వేసంఈనాడు

ఎగిరివచ్చి నిజంపైకి
లెక్కి వచ్చిజనం తిరుగు
బాటుకేసి ఆకలేసి
పిడికెడు కబళంకావా
లని యడిగిన తరుణంలో

లుముంబానుతిన్నావు
కుటుంబాలుకొన్నావు

అమెరికాల కాలు ◌రిగె
ఆఫ్రికాకు నోరు తిరిగె
ఆసియాకు ఆశరగిలె
ఆస్ట్రో ఆఫ్రో ఏష్యన్
కాస్ట్రోలకు కనులు◌రిసె

ఏమంటావ్‌కెన్నడీ
ఈ శ్రీశ్రీ సన్నిధి
చంపేస్తాననినీకో
సందేహంఉండవచ్చు
సర్దేస్తాననినీకో
సమాధానముండవచ్చు

నీ టాంకులు నీ బాంబులు
◌మానాలు ◌ధానాలు
శ్మశానాలు చూస్తాయి
ప్రశాంతినే హరిస్తాయి

నీసలహాదారులతో
నీకలహాచారులతో

పెంట గనుల తుంటరులను
వెంటబెట్టుకునివస్తే

రాకెట్లను◌ప్పుతాం
నీకట్లను ◌ప్పుతాం

జాకెట్లను సవరించి
పాకెట్లను సరిదిద్ది

నీమతాన్నే నీ హితాన్ని
నీగతాన్ని కెలుకుతాం
చీకట్లనుతరుముతాం

నీ హిట్లరు పాతదనం
చావాలని కసరుతాం

◌న్నావాకెన్నడీ
శ్రీ శ్రీశ్రీ మున్నుడి

## సదసత్సంశయం

ఆలోలము లాలోచన
లేవేవో నాలోపల
ప్రాలేయచ్ఛాయలవలె
తారాడగ కోరాడగ

పేరు పేరు వరసలతో
పిలిచి ప్రశ్న వేస్తున్నా
ఈ తెగని సమస్యను భే
దించువారలెవరో అని

ఎన్నో సందేహాలూ
ఎన్నో సంతాపాలూ

జీ◌తంపు చిక్కుముడులు
◌డవెంతగ సడలించిన

ఈ సృష్టికి ఏమర్థం
మానవునికి గమ్యమేది
ఒక సకలాతీత శక్తి
ఉన్నట్టా లేనట్టా

నిరంతరం ఘోషించే
నీరనిధిని పిలిచినాను
ఆస్తి నాస్తి రూపమైన
ఆకాశము నడిగినాను

మహాకవుల గ్రంథాలను
మనసుపెట్టి పఠించాను
ప్రవ్రజితుల ముముక్షువుల
భావాలనే స్మరించాను

యుగయుగాలు తరలెగాని
ప్రశ్న ప్రశ్నలాగున్నది
అలలు కదిసి మరలి చనగ
శిలమాత్రం ◌ుగిలినట్టు

జగదీశరు డతడెవరో
అగపడితే బాగుండును
ఏ◌ు యిది సా◌ు అని
నిలవేస్తా కడిగేస్తా

క◌ హృదయపు కనుమలలో
గర్జించిన పర్జన్యం
పెనుచీకటి తిరుగుబాటు
బీభత్సపు మెరుపుదాడి

కనులముందు చిత్రించే
గతిలేని , జనాల బాధ
కడుపు తరుక్కొనిపోయే
కన్నీళ్ళ ◌షాదగాథ

కరువులలో వరదలలో
కటిక దరిద్రుల అవస్థ
క◌ంతలోన కథలలోన
కట్టాలని తలచినపుడు

ఈ ◌శాల జగతినుంచి
ఏ◌ంటి నే కోరినాను
ఒక జానెడు సానుభూతీ
ఒక దోసెడు తిరుగుబాటు

జ్ఞానులు బోధిస్తూ బ్ర
హ్మానంద మవాఙ్మాధస
◌శదమనీ అనుభవైక
వేద్యమనీ నుడి◌నారు

జపంవల్ల తపంవల్ల
ప్రపంచాన్ని మరచిపోయి
భగవంతుని ధ్యానంలో
పడిపొమ్మని పలికినారు

మంచిచెడ్డలను కొలిచే
మానదండమట దైవం
ఈశరు డొకడే సత్యం
ఇతర సమస్తం ◌థ్యట

ఇంద్రియాలదారా మన
కీ సత్యం తెలియదంట
◌శాసం తప్ప మనకి
వేరే సాక్ష్యం లేదట

అగుపించనిదేదో ఒక
ఆత్మ పదార్థం కలదట
అన్నీ పోవచ్చుగాని
అది మాత్రం చావదంట

నిప్పు దాన్ని కాల్చలేదు
ఛేదించగలేదు కత్తి

నీరు దాన్ని ముంచలేదు
గాలి దాన్ని చెరపదంట

జన్మలనీ కర్మమనీ
చాలాదూరం వెళ్ళిన
ఆలోచనలన్నీ ఈ
ఆత్మచుట్టు అల్లినవే

ఏతదాత్మ సరేషాం
సరత్రా ఆవరించి
సరసం తానే ఐ
శాసిస్తుం దంట జగతి

పుణ్యాపాప నిర్ణేతలు
నీత్య◌నీతిజ్ఞ ◌జ్ఞు
లస్తి నాస్తి ◌చికిత్సకు
లంతమంది యేమన్నా

ఇది మాత్రం నే నెరుగుదు
నెంతమంది యేమన్నా
తథ్యం ప్రాణికి మృత్యువు
తప్పదు జీ◌కి వేదన

జడిగొల్పే దు:ఖంలో
తడియకుండ గొడుగులేదు
ఆనందాలన్నీ తుద
కంతమొందు నొక సమాధి

మనుజునిలో మరణ భీతి
మదిలో దు:ఖానుభూతి
ఆలోచన లన్నిటికీ
ఆంతర్యంతో పునాది

ఎవరయ్యా ఎవరువారు
ఈశర పద జిజ్ఞాసువు
లెవరయ్యా ఎవరంటా
ఇదివరలో ఎవరువారు ?

ఉద్యోగపు ధర్మంలో
సద్యోం హాశ్చర్యంలో
◌టతాటపు బ్రతుకు గడిపి
రిటైరైన పోలీసులు.

నిత్య నిధువనక్రీడా
నృత్యంలో అలసిపోయి
జవసతా లుడిగిపోయి
సాధువైన వేశ్యామణి

నైకానోకహ ◌హారి
కాకంవలె దు:ఖ రాత్ర
ఘూకంవలె సంచరించు
లోక దేషాగ్ని శీలి :

ఇంకా చెప్పాలంటే
ఎందరో మహానుభావులు
బ్రతుకునించి పారిపోయి
తమ వెనుకనే దాగువారు.

మరణ మహాసముద్రాన
జీ◌త మొక దీపంలా
తమపాలిటి శాపంలా
తలపోసే ఫిలోఫర్లు

ఆహా మరి యింతేనా
అందమైన మన మనుగడ
మూడునాళ్ళ ◌ంతేనా
జగమతుకుల బొంతేనా

మెదడన్నది మనకున్నది
అది సరిగా పనిచేస్తే
◌శరహా: పేటికా ◌
పాటన జరగక తప్పదు.

"ప్రవక్ష్యా ◌్యు గీతార్థే
న " యన్నాడు కాళిదాసు

బహుశా అంతకు◌ంచిన
క్ధోనిజమే ఉండదేమొ

ఔను - అహింసను పోలిన
పరమో ధర్మమ్ము లేదు
(పరమో ధర్మం ◌రువకు
పరమ - అధర్మం అంటూ)

ఈ◌ల్, సిన్ మొదలైన ప
దాలను వాడే టప్పుడు
న్యాయం ధర్మం నీతీ
త్యాదుల చర్చించేప్పుడు

ఎవరికి తోచిన అర్థం
వారలు చెప్పక తప్పదు
పరమార్థం సామాజిక
సామూహిక సద ర్తన

కలడు కలండనెడు వాడు
కలడో లేడో అంటూ
లోగడ ఒక ఏనుగు ఆ
లోచనలో పడిందట.

హౌరా హౌరీ మకరితో
పోరి నడుం జారి తుదకు
"నాన్యధాస్తి శరణ" మనుచు
దైన్యంతో నిలిచిందట

◌హల నాగేంద్రుని మొర
◌ని - అప్పుడు కదలెనంట
ఆపన్న జనావన బిరు
దాంచితుడైనట్టి వేల్పు

చక్రంబున నక్రంబుసు
సంహరించి ఆ పిమ్మట
స్థల జలచరు లిరువురికీ
సాయుజ్య మొసంగెనంట

ఇది జరిగిన కథ కాదని
ఎవరో కల్పించిందని
ఇంచుక యోచించ గలా
డెవడైనా గ్రహిస్తాడు.

ఆ ◌షయ మటుండ నిచ్చి
అసలు సంగతికి వద్దాం
ఈ గజేంద్ర మోక్షణ కథ
ఏ◌టి చెబుతుంది మనకు ?

నీ శక్తికి ◌లువలేదు
నీ యత్నం పనికిరాదు
దైవబలం ఉందే అది
అమేయమూ, అజేయమూ :

అందుచేత నూరిపోయు
లొంగిపొమ్ము బేషరతుగ
అపు డాతని కృపచేత స
మస్తం సౌఖ్యాంత మగును.

పిరికితనం నూరిపోయు
పిట్ట కథలతో బానిస
మానసికత నగ్గించే
మన పూరుల నేమనాలి ?

రాచరికపు రోజుల్లో
ఎగుడుదిగుడు సమాజాన
పాలక వర్గాధిక్యం
నిలబెట్టే పూనికతో

మనిషి నిలా తగ్గిస్తూ
మరోదాన్ని ఉగ్గడించి
పరమాత్ముని పేర మత
ప్రవక్తలైనారు వారు

వాళ్ళ నెందు కనడంలే
ఇది మనలో జీర్ణించిన

ముది తత్తం, ఈ సరికీ
వదలిపోని మురికి మందు

## మహాసంకల్పం

ఇదినా సాతంత్ర్యదిన
మహాసంకల్పం
ిధిగాంకసించే
చరిత్రకొకకృతజ్ఞత,
ప్రజలకునివాళి,
ప్రభించిననూతన భారత
పతాకకభివాదం,
భిష్యదుజ్జల
భర్మయుగానికిఆహానం,
సకలజగజ్జనులారా
ఇదిగోనా సాతంత్ర్యసప్నం:

ఏ సాతంత్ర్యంనిుత్తం ఎవరెవరోఎందరో దేశసేవా
భాసంతుల్‌బాలవృద్ధుల్‌పతితు లధికులప్రాజ్ఞులుత్ప్రజ్ఞులంతా
అసాశల్ిడి లాఠీహతులయిఉరికొయ్యల్ కవుంగింటచేర్చా
రాసాతంత్ర్యం లభించిందనిని హృదయంహ్లాద సంపుష్టమైతే

నవోదితసాధీనతానందితోత్ఫుల్లమైన
ధగరంజెండాల పంటలతోనవుతూ పాడుతూఉంటే
ఉత్సాహప్రవాహంలో నేనూఒక బిందువునై
సాతంత్ర్యవాయువులు పీలుస్తూసాగిపోయా

ఆ సమయంలో అందరిమనస్సు
లావరించె నొకవ్యక్తి
అందరిలోనూ ఆ సమయంలో
ఆవహించెనొక శక్తి

అంతట్లోకే ఆకస్మాత్తుగా
జన సందోహంకరిగి
ఒకే వ్యక్తిగా రూపుధరిస్తే
ఇదేం చిత్రమనిచూశాను.

ఒక పెద్ద కాంస్య ◌్రగహా
నికి ప్రాణం వచ్చినట్టుగా,
ఒకే మేఘం గగన పథం దిగి
మానవుడై నిలిచినట్లుగా,
ఒక మహా వటవృక్షం
హఠాత్తుగా నడిచినట్టుగా,
ఒకే ఒక్క మానవమూర్తి
నా కళ్ళముందుకనిపించాడు
ఎం చేతో అతని ముఖం◌ంద
ఎప్పుడూ ఉండే పసిపాప నవులేదు?

ఆ మానవాననంలో
ఏదోకించిదిషాదం, కించిన్నిరాశ
కొంచెం ◌రాగం, కించి దసంతృప్తి,
ఆ మానవ వదనంఅందరికీ పరిచితమే,
అతడే నువ్వూ, నేనూఅంతమందీ వెరసి.

సతంత్ర్యభరతవర్ష వాస్తవ్యుడా మానవుడు
అర్ధనగ్నంగాఆకాశాన్నే కప్పుకొని
నిండనికడుపుతో మాడుతున్నకళ్ళతో
ఇలాఎంతకాలం నిలబడతాడా ప్రాణి ?

అతణ్ణి జాగ్రత్తగాచూడండి
సతంత్ర్య భారతపౌరుడు,
అతని బాధ్యతవహిస్తామని
అందరూ హా◌ఇవండి.
అతని యోగక్షేమాలకు
అంతా పూచీ పడండి,
అతికించండి మళ్ళీ
అతని ముఖానికి నవు:

సాతంత్ర్యంఒక చాలా అందమైనవువు,
చాలావాడైన కత్తి, ◌లువైనవజ్రం
సాతంత్ర్యంతెచ్చే వెన్నెల్లోబాధ్యతలు
సామర్ధ్యంతోనిరహిస్తామని

సంకల్పం చెప్పుకుందాం:

భగవంతుని ప్రార్థించిందికి
బహుశా ఇదిసమయం కాదు,
పాత◌ గుంజాళించిందికి
బహుశా ఇదిసమయం కాదు.

ఇది మనకొక దీక్షా సమయం
ఇది మనకి పరీక్షా సమయం
ఆవేశం ప్రకటించిందికి
అసలే ఇది తరుణంకాదు--

రా : నేస్తం, పోదాం : చూదాం
మువన్నెల జమ్డాపండుగ ;
రా : నేస్తం , లేదాం: చూదాం;
మన భారతజనసౌభాగ్యం.

అటు చూడు సముద్రం,నేస్తం
హర్షానికి పర్యాయపదం:
ఇటు చూడు ◌హాయసనేత్రం
దు:ఖానికి అధ్యాహారం:

ఈ రెండింటిమధ్యనిలిస్తే
నీ లోపల లోలోపలికే
ఆలాపన లాలోకిస్తే
◌నపడదా ఒక సంగీతం,
◌డివడదా ఒక సందేశం;

ఇదీ నా సాతంత్ర్యదిన
మహా సంకల్పం.
ఇది నా ప్రజలకునివాళి
సతంత్ర్య భారతపతాకాని
కిది నా అభివాదం.
భ◌ష్య దుజ్జల
భర్మయుగానికి ఆహ్వానం,
సరిహద్దులులేని
సకల జగజ్జనులారా:
మనుష్యుడే నా సంగీతం,
మానవుడే నాసందేశం :

## ' కో ఈ హస్ రహా హై'
## 'కో ఈ రో రహా హై'

ఒక మనిషి బ్రిడ్జిపైద నడుస్తూ జేబులోని చిల్లర డబ్బులు బిచ్చగాడి కిచ్చేస్తాడు ; రిస్టువాచీని ఎదురుగుండా వస్తూన్న నర్సు కిచ్చేస్తాడు ; కోటుతీసి నీళ్ళలో పడేస్తాడు; దాని వెనుకనే నీళ్ళలో పడిపోతాడు.

ఒక మనిషి వ్యాపారం పారం కనుక్కొంటాడు; వాడి చేతుల్లో రూపాయల చెట్లు మొలుస్తాయి. అం బ్యాంకుల్లో బంగారపు గుడ్లు పెడతాయి; వాటిలోంచి కన్నీరు సొనగా కారుతుంది.

ఒక మనిషి మైలురాయి దగ్గర మౌనంగా కూర్చుంటాడు; అనుక్షణం ఎవరో వస్తూన్నట్టు నిరీక్షిస్తాడు; బస్సులు లెక్కపెడుతూ బటానీగింజలు తింటూ ఉంటాడు; మేఘాన్ని చూస్తూ కాలాన్ని మర్చిపోతాడు.

ఒక మనిషి నిచ్చెనలు మోసుకుంటూ తిరుగుతాడు - సంచీలో బాతుగుడ్లూ వాడూను; గోడకు నిచ్చెన ఎక్కి బాతుగుడ్డు ఆకాశంపైదికి విసురుతాడు; అంత ఎత్తు బంగారానికి హరిశ్చంద్రుణ్ణి కొనుక్కొన్న ఆసామీ వీడే.

ఒక మనిషి రంధ్రాన్ని అన్వేషిస్తాడు; వాటి సైజుల్లో భేదం ఉంటుంది.

ఒక మనిషి అరాజకాన్ని అమ్మజూపుతాడు; దీర్ఘ బాహువుల్తో దేన్నో దేవుతున్నట్లే వుంటాడు; యువకుల హృదయ రక్త కాసారాల్లో దొరికే గజ

నిమ్మపళ్ళు తప్ప మరేమీ తినడు; అదైనా రోజుకి ఒకసారి మాత్రం.

ఒక మనిషి కాంభోజ రాగం పాడుతూ కాలాన్ని వెళ్ళపుచ్చుతుంటాడు. వాడి దగ్గర ఒక్క పైపంచికూడా ఉందన్న సంగతి యిక్కడ జ్ఞాపకం చెయ్యక పోవడం అనవసరం; ఆ వేళల్లో ఆలాపించే రాగాన్ని శాసించడానికే ఆ వేళ్ళు; వాటి స్పర్శకి నక్షత్రాలు అంటుకుంటాయి ; చంద్రుడులో సరస్సులు సలసల కాగుతాయి; నా గుండెల్లో చలికాలం చివురు తొడిగి సీతాకోక చిలకతో పెళ్ళి మాటలు ప్రారంభిస్తుంది.

ఒక మనిషి కర్పూరం, కళ్ళకీ , సింధూరం చెక్కులకి రాసుకుంటాడు; పూసుకుంటాడు; వాడొక కం. రహస్య భాషలో అందుకున్న సందేశాలని వ్యాఖ్యానం చేస్తూ విమానశాఖలో పనిచేస్తాడు; బజారు ధరలు పడిపోతూండడానికి వాడే గొప్ప కారణం.

ఒక మనిషి రుద్రాక్ష తావళాలు మెడలో వేసుకొని జపంచేస్తూ వుంటాడు; బొజ్జతో ఆలోచిస్తాడు; వాడిముందు కొబ్బరికాయలు కొట్టొద్దు మొర్రో అని నేను మొత్తుకోవడంవల్ల ప్రయోజనం లేదని తెలిస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి?

ఒక మనిషి ఒక్కత్తెనే ప్రేమిస్తాడు ; ఆమె చచ్చిపోతుంది; తరువాత కథ తెరమీద చూడండి.

ఒక మనిషిని ఉరితీస్తారు; వాడి చావుతో శాంతిని కొనుక్కుంటుంది సంఘం; న్యాయశాస్త్రం తృప్తిగా నిట్టూరుస్తుంది; వాడి నెత్తురు చిందినచోట ప్రతి సాయంత్రం ఒక కన్నులేని కుక్కపిల్ల జాలిగా మొరుగుతుంది; తన్ను అన్యాయంగా ఉరితీశారని చెప్పడానికి ఇష్టం లేనంత గరం ఆ మానవుడికి.

ఒక మనిషి ఉపన్యాసాలిచ్చి గొప్పవాడవుతాడు; ఒక మనిషి చిత్తుగా తాగేసి బీదవాడవుతాడు; ఒకడు దొడ్డమ్మ దగ్గర కానీ తీసుకుని గాలిపడగ కొనుక్కుంటాడు; ఇంకొకడు దాన్ని లాక్కుంటాడు.

ఒక మనిషి పరారీ అయిపోతాడు; వొకడు పూనాకి పోతాడు; ఒకడు పెళ్ళాడేస్తాడు; ఒకడు పడుక్కుంటాడు; మరొకరు కునికిపాట్లు పడతాడు; ఇంకొకరు బాతాఖానీ కొడతాడు; ఒకడికి ఏడుపుకి నవొస్తుంది; ఒకడి నవు ఏడుపు తెప్పిస్తుంది; ఉదాహరణలతో సహా ఇది నేను ఋజువు చేయగలను.



అండజ భీము డండడడ డండడ డండడ డండ డండ డండడడ డండ డండ డడ డండడ డండడ డండ డండ..... సామీ దీని అంతమెప్పుడు ?

శిష్యా ఇది అనంతం

## గాంధీజీ!

మరచిపోయిన సామ్రాజ్యాలకు
చిరిగిపోయిన జెండా చిహ్నం
మాయమైన మహాసముద్రాలను
మరు భూమిలోని అడుగుజాడ స్మరిస్తుంది

శిథిలమైన నగరాన్ని సూచిస్తుంది
శిలాశాసనంగా మౌనంగా
ఇంద్రధనస్సు పీల్చే ఇవాళిటి మన నేత్రం
సాంద్ర తమస్సు చీల్చే రేపటి మిణుగురు పురుగు

కర్పూర ధూమధూపంలాంటి
కాలం కాలుతూనే ఉంటుంది
ఎక్కడో ఎవడో పాడిన పాట
ఎవడో ఎందుకో నవేపాప

బాంబుల వర్షాలు వెలసిపోయాక
బాకుల నాట్యాలు అలసిపోయాక
గడ్డి పువులు హేళనగా నవుతాయి.
గాలి జాలిగా నిశశిస్తుంది.

ఖడ్గాన్ని రద్దుచేస్తుంది ఖడ్గం
సైన్యాన్ని తినేస్తుంది సైన్యం
పొలంలో హలంతో రైతు
నిలుస్తా డివాళా రేపూ

ప్రపంచాన్ని పీడించిన పాడుకలని
ప్రభాత నీరజాతంలో వెదకకు
ఉత్పాతం వెనుకంజ వేసింది
ఉత్సాహం ఉత్సవం నేడు



అవనీమాత పూర్ణగర్భంలా
ఆసియా ఖండం ఉప్పొంగింది
నవ ప్రపంచ యోనిదారం
భారతం మేలుకుంటోంది.

నేస్తం మనదు:ఖాలకి వాయిదా వేద్దాం
అసౌకర్యాలు మూటకట్టి అవతల పారేద్దాం
ఇంకోమాటు వాగాదం ఇంకోనాడు కొట్లాట
ఇవాళ మాత్రం ఆహ్లాదం ఇవాళ తురుఫాసు

## మంచి ముత్యాల సరాలు

ఎర్రశాలువ కప్పుకొని మా
ఇంటి కొచ్చిందొక రివాలర్
బాధలో బెంజైన్ సీసా
ప్రేమలో డైమన్‌రాణి.

మెడకి కాంచనమాల చక్కని
జడకు చుట్టిన పుష్పవల్లి
చావుబతుకుల జ◌ులిదుప్పటి
కప్పు కొచ్చింది.

ప్రేమగానం మోసుకుంటూ
మహాశంఖం మాటలాడదు
ఐంద్రకార్ముక మంత్ర బర్హం
మబ్బుచాటున మాయమైనది:

పాత పీపా పీతపాపా
పాడుకుంటూ తిరుగుతాయట
కొత్త గొంతుక చె◌ని పడితే
గుడ్లు నిప్పులు చెరుగుతాయట.

నేను వెళ్ళిన నాటినుంచీ
నీడలోపలి మేడ దిగదట
కోడిగ్రుడ్డు ప్రమాణకంగా
కృష్ణశాస్త్రిని చదవలేదట.

నన్ను తిట్టిన తిట్లతోనే
మల్లెపూవుల మాలకట్టెను
నాకు వ్రాసిన ప్రేమలేఖలు
పోస్టుచేయుట మానివేసెను.

వెయ్యిరాచ్చిప్పలని మేసిన
వెర్రికుక్కకి గాలివాన
రోలు చెప్పిన కథకి పాపం
డోలు కంచికి పైనమైనది.

ఓరి కూపస్థ భల్లూకం
గోడపై రుద్రాక్షపిల్లీ
ఆటలోపల అరిటిపండు
పాట లెందుకురా.

ఎగురుతున్నాయ్ ఇనపకోటలు
పగులుతున్నాయ్ పాతపాటలు

రగులుతున్నాయ్ రాచబాటలు
రాజుకోవేరా.

ప్రేమకి సంఘానికీ ఒక
జారుముడితో చాలు పోరా
నిన్ను తిట్టేవాళ్ళకోసం
కళ్ళు ◌ప్పుకు నిద్రపోరా.

ఇదే నా కడసారి సలహా
ఇలా తే నీ మనీపర్సుని
ఆంధ్రపత్రిక కప్పుకొని కా
రడ◌ కేగిం దా రివాలర్.

నేడు నా కంట్లో సివంగులె
నిద్రలో నిలిచే ఫిరంగులు
కాళ్ళ చుట్టూ కపాలాలే
కావ్యగీతీ కలాపాలు.

## ఏ◌ తల్లీ!

(THE SNOWS OF YESTER YEAR)

(F. Villon అనుసరణము)

చక్రవర్తి అశోకుడెచ్చట ?
జగద్గురు శంకరుడెచ్చట ?
ఏ◌ తల్లీ : నిరుడు కురిసిన
హిమ సమూహములు ?

కాళిదాసు మహా క◌ీంద్రుని
కవన వాహినిలో కరంగిన
ఉజ్జయిని నేడెక్కడమ్మా
ఉంది ? చూపించు ?

షాజహాన్ అంతఃపురములో
షట్పదీ శింజాన మెక్కడ :
ఝాన్సీ లక్ష్మీదే◌ యెక్కిన
సైంధవం నేడేది తల్లీ ?

రుద్రమాంబా భద్రకాళీ
లోచనోజ్జల రోచులే◌ి.:
ఖడ్గతిక్కన కదనకాహళ
కహకహ ధను లెక్కడమ్మా ?

ఎక్కడమ్మా కృష్ణరాయని
బాహు జాగ్ర ద్బాడబాగ్నులు ?
బాలచంద్రుని బ్రహ్మనాయని
ప్రాణ వాయువు లే◌ం తల్లీ ?

జగద్గురువులు, చక్రవర్తులు,
సత్క◌ిశులు, సైన్యనాధులు,
ఆనవతులగు మహారాజ్ఞులు
కానరా రే◌ిు ?

పసిడిరెక్కలు ◌సిరి కాలం
పారిపోయిన జాడలే◌ి ?
ఏ◌ి తల్లీ : నిరుడు కురిచిన
హిమ సమూహములు ?



## సామాన్యుని కామన

సామాన్యుని వాస్త◌ంకత
ఈ రోజున సామాన్యుడు
ఏ◌ీు లేనట్టివాడు
కూడూ గూడూ గుడ్డా
ఏ◌ీు లేనట్టివాడు
చదువూ సాము శాస్త్రం
ఏ◌ి యెరుగని వాడు

ఈ రోజున సామాన్యుడు
సగం దేవతాంశ, సగం
రాక్షసాంశ, సగటున ఈ
సామాన్యుడు మానవుడు

అంటే నీవూ నేనూ
ఆమె ఈమె ◌ిడు వాడు

అంతా సామాన్యులమే
సగం వెలుగు సగం నీడ
సగం ఋతం సగం మనృతం
సగం ఆడ సగం ఈడ
సగం పశువు సగం నిసువు
ఈ వెల్తురు ఈ చీకటి

ఈ యిరులూ ఈ వెలుగూ
వేరు వేరు గదులు కావు
ఒకటి రెండూకూడా
ఇపుడు నిప్పు ఇపుడె పువు
ఇప్పుడు దూసిన
ఇంతట్లో కౌగిలించ
ఒక నేత్రం కల్హారం
మరో కన్ను కర్పూరం

మూడో కంటి వాడంటూ
లేడంటే నమ్ముతావ్
చూడవోయ్ నీలోకి నీవు
ఒకటి రెండు వెరసి మూడు



నరకం సర్గం అన్న◌
ఒక స్థితికే రెండు పేర్లు
ఫోకస్ భేదం అంతే
లోకస్ రెండిటి కొకటే

శ్రీ అనగా లక్ష్మి, సరే
శ్రీ అంటే ◌షం కూడా
శ్రీ శ్రీ సిరి చేదు లేక
సిరీ సిరీ, చేదు చేదు

◌ఁ యిష్టం శ్రీకారం
గుణకారం చేసుకొండి
◌ఁకే అర్థం తోస్తే
ఆ key నే వాడుకొండి

ఒకటే శ్రీ అదే రెండు
అదే చేదు సిరీ అదే
అమరతం అసురతం
శ్రీ శ్రీ ఒక మానవుడు

## నే పథ్యంలో :

నీ మూసిన పిడికిటిలో
ఏమున్నది కం కం
ఆ దాచిన పళ్ళెంలో
ఏం తెచ్చావ్ సుకం
ఆ మూలని కంకం
నీ మూసిన గుండెల్లో
ఏం దాచావ్ సుకం

నీ పాడని పాటలలో
రాపాడే దేదికం
ఆ కొసలో నీడలలో
ఏ సత్యం సుకం

ఏ సత్యం ఏ సప్నం
ఏ సర్గం సుకం
మా కోసం నీ కోసిన
వే కాన్కల పూలు కం

## సామాన్యుని కామన

సైన్సువల్ల ఈ రోజున
సామాన్యుని బ్రతుకు కూడ
సౌందర్యమయం కాగల
సదుపాయం లభించింది

జన్మం చర్మం వెనకటి
సంప్రదాయమూ ఇప్పటి
సంఘుస్థితులూ నెరపే
అసమానత పనికిరాదు

ఐశర్యం అందరిదీ
అందుచేత అందులోన
సామాన్యుడు తన వాటా
తనకిమ్మని కోరుతాడు

బతకడమే సమస్యగా
పరిణ◌ంప జేసినట్టి
అన్యాయాలన్నిటినీ
హతమార్చాలంటాడు.

ఇదేం పెద్ద గగనమా ? మ
రిదేం గొప్ప కోరికా ? ఇ
కేం ? ఇదొక్క ◌ప్లవమా ?
ప్రశ్నిస్తే పాపమా ?

యుగసంధిది, సామాన్యుని
శకం దీన్ని కాదనరా
దిది రేపొచ్చే వ్యవస్థ
కివాళనించీ , పునాది
ఇప్పటినించీ నాంది.

అంతే ,ఇంతే సప్నం :
అన్నీ ఒక్కడికి బదులు
అంత మందికీ అన్నీ :
అదే సర్గమంటాను.

ఆ సర్గం వేరే కడు
దూరంలో లేదు లేదు
ఈడే నేడే , వున్నది.
నీలో నాలో వున్నది.

◌ీ యిష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు సర్గంగా
చీల్చవచ్చు నరకంగా
ఏం చేస్తారో సరిమరి యిక ◌ీ యిష్టం.

రుబాయత్

Charlie Chaplin, Joseph Stalin
Walt Disney, Georges Hunnet
Greta Garbo, Pirandello
ఇటీవల మా inspiration.

Sigmund Freud , Harold Lloyd
Albert Einstein, Jacob Epstein
హరీన్ చట్టో, గిరాం మూర్తీ.
ఇటీవల మా inspiration.

కథాకలీ కూచిపూడీ
జావా నాట్యం, Russian Ballet,
Jazz, Rumba, Carioca
హుషారిస్తాయ్, నిషా చేస్తాయ్.

Don Bradman Mohan Bagan
Walter Lindrum, Vines, Cochet
కొంచెం carroms, కాస్త Pin - Pong
ఒక cup కాఫీ, ఒక పఫ్ cegarette
తమాంషుడ్.

## భ్రమరగీత

( శాంతిలో అశాంతి అశాంతిలోనే శాంతి అనుభ◌ంచగలడు శ్రీ శ్రీ)

గిరగిరగిరాం
భ్రమరం
గిరాం భ్రమణం
భ్రమం
'భ్రమరణం'
భ్రమణ భ్రమరం
భ్రమర భ్రమణం
గిరగిర గిరాగిరాగిరాం భ్రమణం
రణం
మరణం

రణమరణం దారుణహననం
ధిషణానిధనం
వృథామథనం
అది నా చె◌లో కథనం
లోకధనం
కదనం
కదన కథాకథనం
అది నా యెదలో రణనం
ఝణ ఝణ ఝుంఝణ ఝణాఝణా నికణనం
అది నా నయనంలో ప్రథ మారుణ కిరణం
రణ నిస్పృహాణం
వధ ◌ధా నాచరణం
నాలో లోలోపల భ్రమా భ్రమర సంచరణం
రణద్రణ నిస్పృహణ ప్రణవం
అది నా హృదయంలో రుధిరజలనం గీతాజననం:::

## బొమ్మలాంతరు



దిద్దుతూన్న గుంట ఓనమాలు చెరిపేసి
చేతిలో ఉన్న బలపం ◌రిచేసి
కొత్త పలక కొనుక్కొచ్చాడు కుర్రాడు

పాగా చుట్టుకొంటూన్న రోకలి పారేసి
తెలి◌తక్కువ తనాన్ని గొయ్యి చేసి పాతేసి
పొరుగువాడెలా ఉన్నాడని భోగట్టాచేశాడు వెర్రాడు

ఆడుతూన్న నాటకం ఆపేసి
పెట్టుకున్న గడ్డం కుళ్ళాయి లాగేసి
ఆడియన్సులో కలిసిపోయాడు ◌దూషకుడు

నిన్నటి వాగ్దానాన్ని నేటి ఉపన్యాసంలో కాల్చేసి
నేటి ఘోర్జరీని రేపటి సంతకంగా మార్చేసి
ఇక్కడే వుండు వొస్తానని ఎక్కడికో పోయాడు ◌నాయకుడు

తన చుట్టూ తాను తిరుగుతూ
సూర్యుడి చుట్టూ పరిభ్ర◌ంచే భూ◌లాగ
ఆశయంచుట్టూ తిరుగుతోంది ఆవేశం.

(చీట్లాటలో ఒక చేతిని అన్నీ పొడిముక్కలే అయి ఒక బొమ్మ లేకపోవడం బొమ్మలాంతరు.
అప్పుడు ఆట కలిపి మళ్ళీ ముక్కలు కలపడం ధర్మం).

## ఆఖరిమాట మొదటిమాట !

ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం
ఆకాశం నా గుడారం
అ ఆలు నా ఆస్తి
ఆసియా అంతవాణ్ణి
ఆశలకేం అనంతం
అప్పారావు నా నేస్తం
ఆంధ్రతం నా శాపం
◌శాఖపట్టణం వూరు
వెర్రాసుపత్రి పేరు
ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం
ఆసియా అంతవాణ్ణి
ఆశలకేం అనంతం

అమాంతంగానే కాదండయ్యా క్రమంగా క్రక్రమంగా నా
సమస్తం ◌ి సమక్షంలో సమర్పిస్తా శ్ర◌ుస్తే
కపాలం న◌తేనేం కంపింపింబింబింపిస్తా! నీ
ప్రపంచాన్నే ,పాటల్లో ఆటల్లో నా మాటల్లో

ఇదే నా రహస్యం
యథార్థం నా తురుపు

నా కేమున్నాయిలే ఆసులా రాజులా రాణీలా
జాకీలా క్షణకాలం జెండా ఎగిరించేస్తాం
ఆ కొంచెం చాలదంటే సైనైడుకూడా కొంచెమే కా
దంటే కాదనండయ్యా అన్నయ్యలారా

పరమాణువు నా ప్రపంచం
నాతో నా గుణకారం

క్షణాన్నే సాగదీస్తే కాలం డొంకంతా కదల్దా
ఇలాగే ఎక్కేద్దాం శిఖరం కొత్త రాస్తాలు తీస్తూ
◌లిట్రీ లారీ నడిపించే పద్ధతిలో పద్హతితోనే
అణాలూ అరణ్యాలూ అణువుళూ అద్రులూ దాటుకుంటూ

ఆవేగం నా వేగం
ఆసియాలకేం అనల్పం

◌కృతం శుంతాయమానంగా కనబడితేనేం
ఒకానొక ఋజుతం సాధిస్తాం మనం లోపా
యికారీ వ్యాపారాల్లో పాల్గొంటామా చేస్తే
అకస్మాత్తుగా ఓపెన్‌గా చేస్తాం లేకపోతే నిద్రపోతాం

సప్నంలో సర్గం
హతాశయాలకి పొటాసియాలు

హిపోప్పొటామస్ హిట్లర్ హిండెన్ బర్గు హిడింబా
హిరణ్యాక్ష రాజ్యాలూ ఇవన్నీ ఎందుకోయ్ ప్రీ ప్రీ
శ్రీతో శ్రీ శ్రీశ్రీతో శ్రీశ్రీ శ్రీశ్రీశ్రీతో శ్రీశ్రీశ్రీ
శిఖరంపై జెండా శిలలకి ప్రాణం చీనీతో చీనాతో స్నేహం

ఆఖరి మాట మొదటిమాట
ఆశలకేం అనంతం
అప్పారావు నా నేస్తం
ఆంధ్రతం నా శాపం
ఆశయం అంతవాణ్ణి
ఆశలకేం అనంతం
ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం
అప్పారావంత వాణ్ణి
ఆశలకేం అనంతం

## ◌దూషకుని ఆత్మహత్య

కొవొత్తు లారిపోయినై
క్లోరోఫారంలా చీకటి కమ్ముకుంది

ప్రపంచం తన మరణశాసనం రాసుకుంది.
◌దూషకుడు ఆత్మహత్య చేసుకున్నాడు.

యంత్రాల మంత్రగానం
◌షధూమాల తుపాను
స్టీమర్లో చింపంజీ
నాందిలో భరత వాక్యం
మృత్యువులో సృష్టి
◌దూషకుని ఆత్మహత్య.

◌దూషకుని ◌కట హాసంలో
కపాలం పకాలన్నది.
ఆకలి అన్నం వండుకుంది,
హంస ఆకాశం అందుకుంది.

◌దూషకుని ◌షాదం
సముద్రంలో బడబాగ్ని
భూకంపంలో ఫ్రూట్‌శలాడ్.
కాని
కొవొత్తులు మళ్ళీ వెలిగి
మరణ శాసనం మండి పోయింది.

## టాంటాం

నిన్ను
ఇంద్రుడవనీ, చంద్రుడవనీ
ఇంద్రుని హితుడ వనీ
చంద్రుని హితుడ వనీ

ఇంద్రసుతుని హితుని మేనమామ వనీ
చంద్రహితుని సుతుని బావమరిది వనీ
కరి కరి భిత్
గిరి గిరి భిత్ - కబుర్లతో
కవులు పొగడడం మేం ◌
న్నాం, ◌
న్నాం

కాని నువు
పురుగువనీ నురుగువనీ ఏ◌ు
ఎరుగవనీ
వొట్టి చేటపెయ్యవనీ

కొయ్యవనీ గుడ్డి గవ
చెయ్యవనీ

గోడ◌ుద నీడవనీ
చేతకాని వాడవనీ
పెద్ద లక్కబొమ్మని వాజమ్మవనీ
మేధావద సాధారణ
గాధలు మేం నమ్మమనీ

కష్టం కావచ్చుగాని
స్పష్టం గానే మేం అం
టాం : అం
టాం.



## కొంటె కోణాలు

ఛందో బందో బస్తు లన్నీ
ఛట్ : ఫట్ ఫట్ మని త్రెంచి
damn it : ఏ◌ుట్రా ఇ ? దంటే
Pray : it's poetry అందాం.

అర్థాన్ని అధానపు అడ◌లో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేదాం.
కాదన్న మాదన్న యెవడన్నా ఉంటే
వేమన్న యేమన్నాడో చూడ మందాం.

హాష్ హూష్, హూష్ హాష్ అని కేకలు వేసి
కావ్ కావ్ మ్యావ్ మ్యావ్ అందాం గమ్మత్తుగా.
న...న...న.... న.... ..నత్తిమాటలు కూడా
మ.....మ.....మ....మ...మన వ్రాతల్లో ఉండొచ్చు

అచ్ఛా : సేచ్ఛాజీ◌ :
ఐతే, కైతే నీ వ్రాతని
argument కోసం ఒప్పుకున్నా,
పానుగంటివారు ఒప్పుకోరు.

పానుగంటివారు ఒప్పుకోకపోతే
పామువంటి దానికి ◌రుగుడుంది.
ఇంద్రకంటివారి నడిగితే
ఏ◌ంటటంటారో తెలుసునా

“పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం ;
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
మానిషాద గీతంలో ఉన్నది.”

కటకటా ! లోటిపిటా చస్తే
కృ. శా. ◌షాదకావ్యం వ్రాయాలా ?
Sex లో x కర్థం తీస్తూ
చలం కలం పట్టుకోవాలా ?

జీబ్రాకి algebra చిహ్నాల
లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు surrealism రా సోదరా.

ఎ ఏ ఐ ఒ ఓ ఔ

ఎ

ఎక్కడ ఎప్పుడు

ఎవరైనా చెప్పుడు ఈ చిక్కు ◌ప్పుడు

ఆరంభం ఎక్కడ

అంతం ఎప్పుడు

ఎందుకీ నొప్పులు ఏంటీ చప్పుడు

లక్షలు లక్షలు

యక్ష ప్రశ్నలు అన్నీ తప్పులు

ఏచోట జననం

ఏ పూట మరణం

ఈలోపున ఎన్నెన్ని పడరాని తిప్పలు

కంట్లో కారం

ఒంట్లో భారం గుండెల్లో దాహం

ఉచ్ఛ్వాసం నిశ్వాసం

ఒకే అనుప్రాసం

సందేహం పన్నుతుంది సరోరుహ వ్యూహం

ఆగమనం నిష్క్రమణం

అంతా ఒక చంక్రమణం ఆలోచించు బాగా

ఏదైతే సవాలు

అదేలే జవాబు

ఒమెగా ఆల్ఫా, ఆల్ఫా ఒమెగా

శాస్త్రం నీ అస్త్రం

మౌనం శ్మశానం అదికాదు జ్ఞానం

పరీక్షించు సహేతుకంగా

ప్రసంగించు సాధికారంగా

స◌ుక్షి సూత్రం మాత్రం సరైన ◌ధానం

ఏ◌ుటీ చప్పుడో

ఎందుకీ నొప్పులో అంతం ఎక్కడో

ఆనందం ఎప్పుడో

ఆ చిక్కు ◌ప్పుడు

ఎక్కడా ఎప్పుడూ ఎవడూ చెప్పడు

ఏ

ఏదైనా గీతం

చేదైనా మైమరపిం

చేదైనా మది కదిలిం

చేదైనా ఎద రగిలిం

చేదైనా ఏదైనా

నేడైనా

రేపైనా

ఏమైనా గానం

జడి జడిగా వర్షం నా

మెడ◌ిుదా

తొడ◌ిుదా

తడితడిగా రక్తం నా

గదిలోనూ

హృదిలోనూ

దడదడగా కంపం నా

నడినెత్తిని రంపం

నా కోసం ఆకాశం

చేకూర్చే ఆవేశం

రేగించే ఉద్రేకం

ఊగించే ఉద్వేగం

దావానల హాలహల

కీలోజ్జ్వల కోటీరం

నీలోత్పల కాసారం

నీ లోపల కేయూరం

కనిపించక జడిపించే

కికురించే సకిలించే

కిటికీలో రూపం వా

కిటి ముంగిటి ధూపం

గాలంవలె శూలవలె

వేలాడే కాలం

వేటాడే వ్యాఘ్రం అది

వెంటాడును శీఘ్రం

కాలానికి భయపడితే

కలిగేదే శోకం

కదిలేనా లోకం

దొరికేనా నాకం

కనుపాపలు తెరచాపలు

ప్రళయంలో పయనం

నిరయంలో శయనం

◌లయంలో ◌జయం

ఐ

ఐక్యం అదీ మనకి ముఖ్యం

అందులోనే ఉంది సౌఖ్యం

లేనిపోని చీలికలు

రెండు రెండు నాలికలు

ఛీ యిదా బతుక్కి

ఫాయిదా

ఐక్యం అదీ వ్యవస్థ

అప్పుడుండదు మనకీ అవస్థ

కాదు ఔను అవును

కాదు కాదు అవదు

అనేకం అయితే ఏకం

అదే ◌వేకం

ఐక్యం అన్నింటికీ మూలం

అటే కదుల్తోంది కాలం

పురోగతి ప్రపంచనీతి

మనదొకే మానవజాతి

వ్య క్తికి బహువచనం

శక్తి

ఐక్యం అదే మనకి గమ్యం

అప్పుడే సిద్ధిస్తుంది సామ్యం

వ్యర్థం వద్దంటా

యుద్ధం వద్దంటా

కామ్యం ఐక్యం అయిన బతుకే

రమ్యం

ఐక్యం ఎప్పుడో కాదిప్పుడే

ఎక్కడో కాదు అదిక్కడే

మాట చేతగామారి

మనిషి మనిషితో చేరి

సప్నం సత్యం ఐతేనే

సర్గం

ఒ

ఒకనొక అనగా అనగాల వేళ

(అది కృతయుగం కాదు మృతయుగం)

అదే మన కథలకీ క◌తాలకీ డోల

మనుష్యుని బాల్యంలోని అమాయకతం

(ప్రార్థించే మొక్కలూ

మాట్లాడే నక్కలూ)

కళలో జీ◌తంలో నిదర్శించే అరణ్య తతం

సామూహికం సాతంత్ర్యం అనేషించు అగత్యం

(ఒంటరి తనం

తుంటరి తనం)

సామాజికంగా పెరుగుతోంది సేచ్ఛ ఇది సత్యం

అజ్ఞానం చీకటి భయానికీ క్రౌర్యానికీ కాణాచి

(శిశుతం అదే

పశుతం అదే)

చంపటానికి సరదా అమ్మయ్యో బూచి

మార్చాలంటా ఇదంతా ప్రసరించాలి కాంతి

(శాస్త్రం కళని చంపబోదు జనాన్ని భయంతో నింపలేదు)

మానవాళికి పరిణామం కానుక పావురంలాంటి శాంతి

ఓ

ఓహో ◌హంగామా

ఎగురు

ఎగురు

నీ రెక్కల ◌సరులో మనంతరాలు

తరలు

తరలు ఓహో

తరంగమా

కదలు

కదలు

నీ ముంచెత్తు వరదలో నిమ్నోన్నతాలు

కరగు

కరగు

ఓహో మృదంగమా

పలుకు

పలుకు

నీ◌చ్చు హెచ్చరికలో నిరాశా దురాశా భాండాలు

పగులు

పగులు

ఓహో జనాంగమా

నడువు

నడువు

నీ పరాంకోటి హస్తాలతో నూతన గవాక్షాలు

తెరువు

తెరువు

ఔ

ఔను వాహనం మారింది ; దూరానికి పూరపు టర్ధం పోయింది

పూరం దూరం పోయింది వెనకటి వాహనం మారింది

ఆ సూర్యుడే నేడూ

ఆ చంద్రుడే నాడూ

అవే నక్షత్రాలూ - ఐనా కాలం మారింది

ఔనా కాలం మారింది మరి : మానవుడా మేలుకో నేస్తం

ఎద్దుబండితో కొలవకు దూరాన్ని ఎగరవోయ్ చదలయెద చీలుస్తూ

రేపు బయల్దేరా లనుకున్నావు

నేడే ఇచ్చటికి వచ్చేశావు

◌చ్చేసింది నీ తరుణం పుచ్చుకో ఇది నీ భా◌

ఇది నీ భా◌ గ్రహించు : ఈ భా◌ నీకు నా ప్రెజెంటు

భూతకాలపు సరీసృపాలని పాతరాతి యుగంలో పారేయ్

పాతెయ్ నీ సందేహాలని

తోలెయ్ నీ మందాక్షాలని

నిటారుగా నిలబడు నేస్తం హుటాహుటిగా ముందుకిసాగు

హుషారుగా ముందుకిసాగు : ఊరిఖే వెనక్కి చూస్తావేం

దుప్పి◌ కుక్క◌ కావు తిర్యగ్జ్రుక్కు◌ నువుకావు

దూరం కరిగిపోతోంది

కాలం మరిగిపోతోంది.

మానవుడిగా మేలుకో నేస్తం ఏలుకో ఈ ◌శం సమస్తం.

## అభిసారికి కడసారి

ఆకాశం◌ద రాకాసికోర
ఏడకయ్యా పోతావు
కోరచుట్టూ నెత్తుటి చుక్కలు
ఏడకయ్యా పోతావు

కనుమలోనిది - కొ - కొ - కొ - కొలి◌ు
వెళ్ళకయ్యా చెడతావు
నీడచూడకు నీకే హాని
సంకేతం ని శ్మశానం

◌ంతైనది ◌హంగం
ఏడకయ్యా పోతావు
చూపులలోని◌ సూదులు
ఎందుకయ్యా పోతావు

'పడుచుదనానికి జడుపులేదు
సంకేతం నా సరస్సు'
వెళ్ళకు వెళ్ళకు చస్తావు
నాచు నిండిన కోనేరు

ఏ◌ుటి దంతపు చర్మం◌ద
ఎర్రని పచ్చని దేదో మచ్చ
లోతులోయలో భూతాలు
కొలి◌ు నిప్పులో గుర్రాలు

సూదికి కంట్లో సోపానం
కాళ్ళకి కళ్ళూ సంకెళ్ళూ
సంకేతం నీ సాలర్సాన్
జలపాతంలో జంఝూటి

# ఒకటీ - పదీ

ఈ ఫస్టోబరు రోజు ఎవరా వస్త
చెప్పండి కాస్త ఎవరా వస్తున్న రాజు
ఆరంభ మంగళముహూర్తం ఆసన్నమయింది
ఆహ్వానం కోసం మా గానం ఆయత్తమయింది
అయితే ఆ వస్తున్నది ఆం అవునో కాదో
ఆసదించబోయే అనుభవం ఆఖరకు తీపో చేదో
శ్రీరాములుచుట్టి చిత్తగించవలెను దాకా
ప్రవహించిన ◌జయ ప్రభ◌ంచే తనయ
ఆం కాకపోతే ఏం అందులో ఒక ముక్క
ఆ ముక్కలో ఒక చెక్క అయినా ఇదే మా ఓం
అదో పదో నెల బాల
హోస ◌శాల
పుట్టింది కొస్తోంది
పూర్ణ గర్భిణి

తారంగం తారంగం లాలీ లాలీ
ఆనందం ఆనందం హాయీ హాయీ
శంఖాలూ ఢంకాలూ మ్రోగించండీ
స్నేహార్ద్రం సౌహార్దం సాధించండీ

రైలుబండి లేటయిందా
వంతెన చుట్టూ వరదలా
ఇంజన్ సరిగ్గాలేదూ
ఎందు కదంతా పోదూ

పూలదండతో
నిండింది స్టేషన్
కోటి గొంతుకలతో
పాడింది నేషన్
పదిలంగా పొగబండి
చేరింది డెస్టినేషన్
రారండీ రారండీ యావన్మందీ
ఆడండీ పాడండీ హ్లాదం చెందీ

ఆంధ్రరాష్ట్రం ఆగమనం
అసత్యం కాజాలని చారిత్రక వాగ్దానం
మన చరిత్రాత్మక నిరంతరాందోళన
చరితార్థ మయిం దీనాడు

ఈ రాష్ట్రం ఇదిగో ఇప్పుడే చెబుతున్నా
ఏదో కొందరి సదుపాయాని కేర్పడలేదు.
ఎవరో కొంద రుద్యోగులకని వేర్పడలేదు

ముక్కోటి ఆంధ్రుల ఆకుంఠిత దీక్ష
అజేయ సంకల్పం
ఆంధ్రావతరణకి కారణం

ఈ రోజు ఊరేగింపులు జరుగుతాయ్ నిజమే
ఉత్సవాలు జరుగుతాయ్ నిజమే
ఉత్సాహం ఉప్పొంగుతుంది నిజమే
యాథా◌థిగా అన్ని లాంఛనాలూ సాగుతాయ్ నిజమే

కాని ఆ లాంఛనాలన్నింటి తరాత
వచ్చిన అతిథులు వెళ్ళిపోయిన తరాత
పాటలూ ప్రసంగాలూ జయ జయధానాలూ చల్లబడ్డ తరాత

సంబరాల తరాత
సంపాదకీయాల తరాత
సామాన్య మానవుడి భుజస్కంధాల ◌ుద
సమస్తభారం పడుతుంది
అతనిదీ ఈ రాష్ట్రం
అతనికోసం ఈ రాష్ట్రం
పెత్తనం చెయ్యాలని ముందుకొచ్చే
పెద్దలిది గ్రహించాలని హెచ్చరిక

శుభంగా శోభావహంగా
ఆకారం తాల్చుతున్న ఆంధ్రరాష్ట్రం
ఆంధ్రజాతి కంతటికీ ◌జయం
ఆంధ్ర సంస్కృతికి అఖండ ◌జయం
ముఖ్యంగా అతి ముఖ్యంగా
ఆంధ్రభాషకిది అపూర ◌జయం

ఇది ◌నండి మరి
◌ప్లవం ముమ్ముందు మనుష్యుని మనస్సులో ప్రారంభమవుతుంది
మనఃప్రపంచానికి బాహ్య ◌ప్లవం
అందుకే ఈ ఆనంద సమయంలో
భాషలోనూ భావంలోనూ ◌ప్లవం తెచ్చిన
మహా మానవులైన
మన గిడుగు గురజాడ ◌ీరేశలింగం
మహానీయులను
నా మనఃఫలకంముందు సాక్షాత్కరింపజేసుకొని
నమస్కరిస్తున్నాను
వారిచ్చిన ఆశీరాదాలు
తీర్చిదిద్దిన ఒరవడులు
చిరకాలం మన ఆంధ్రావనికి
శ్రీరామరక్ష

దేవతలే మానవులే దీ◌ంచాలి
దేశంలో దేవతం దీపించాలి.

ఈ ఫష్టోబరు శుభవేళ
నిన్నటి మన సరూపం స్మరించి
నేటి మన సభావం గ్రహించి
రేపటి మన సమాజంకోసం కలిసిమెలిసి క్ర◌ంచుదాం

నిన్న మన ఓడరేవులనుంచి దేశదేశాలకి
మన నాగరికత నౌకాయానాలు చేసింది
నేడు మన రహదార్లు ఎద్దుబళ్ళకి ఏడుపు తెప్పిస్తున్నాయ్
ఇనుపదార్లు ఇరుకైపోయినాయి
రేపు మన ◌శాలాంధ్ర ◌మానాశ్రయాలనుంచి
మహాకాశాల్లో మన ◌మానాలు ప్రయాణం చేస్తాయ్.

నిన్నటి మన రాజనగరాల్లో
రత్నరాసుల ◌పణి◌ధులు
◌దేశీయులకి ◌భ్రాంతి కలిగించాయ్
నేడు పట్టణాల పాలకసంఘాలు
దరిద్రాలను తరి◌ వెయ్యలేక

అంధకారాన్ని అరికట్టలేక
అలమటించి అల్లాడుతున్నాయ్.

రేపటి మన జల ిద్యుత్ ప్రణాళికలు
సిమెంట్ కాంక్రీట్ ినిర్మాణాలు
ట్రాక్టర్లు బుల్ డోజర్లు
పారిశ్రాిక వ్యవసాయక సహసమానాభివృద్ధితో
ప్రతి కుటుంబానికీ ఒక నివాసగృహం చూపిస్తాయ్
ప్రతివ్యక్తి చేతికీ ఒక పని కల్పిస్తాయ్
ప్రతి మనస్సులో ఒక పరిశుభ్రమైన గీతం పలికిస్తాయ్.
నిన్న మనదేశం మహామంత్రులైన అక్కన మాదన్నలని లోకానికిచ్చింది.

నేడు మంత్రి పదవుల మంతనాలతో వాతావరణంలో
దుమ్ముదుమారం చెలరేగింది
రేపు జాతినంతటినీ ఏకమార్గంలో నడిపించి
అఖిలభారతావనికే ఆదర్శం చూపించగల
మహానాయకుడు మనకు లభిస్తాడు

నిన్న తమకంటే హెచ్చువారి కాళ్ళుపట్టుకొని కొలిచి
తమకన్న తక్కువవారిని కాళ్ళకిందపట్టి అణచి
చిరునవ్వుతో స్తిితంగా సర్దుకుపోయే మనస్తతం
నేడు ఆ మనస్తతపు అవశేషాల నెదిరించి
పోరాడుతున్నవారి తిరుగుబాటు
రేగించిన ప్రచండ సంఘర్షణల
ప్రభంజన గర్జన

రేపు మానవుడు మానవుని లోని మాన
వతం గుర్తించి మహనీయులై
సరికొత్త మర్యాదలు సృష్టించే
మహత్తరకాలం

నిన్న కితానికి రాజాధిరాజుల ఆదరణ
నేడు ప్రభువులలో పరిపాలకులలో ఇంకిపోతూన్న రసహృదయం
ఆనందానికి అవకాశాలూ తీరుబాటూలేని
అసంఖ్యాక ప్రజానీకం
రేపు మేలుకొన్న ప్రజలు శిరస్సున ధరించి
ఆదరించే అతి నిిన కితామాధుర్యం

సంతోషం సంరంభం నేడే నేడే
సౌమార్గ్యం సౌభాగ్యం రేపే రేపే

## నగరంలో వృషభం

నగరం నడి ◌ీధిలో
వృషభం తీరుబాటుగా
గత జన్మ సంస్మృతులు కాబోలు
కనులరమోడ్చి మెదలకుండా
నగరం హృదయంలో వృషభం
దారికి హక్కుదారు తానే అయినట్లు
పరిత్యజించి కాలానికి బాధ్యత
పరిహసించి నాగరికత పరుగు
నిలబడింది నేనే రాజునని

ఎవరు పొమ్మనగల రీ ఎద్దుని
ఎలా చూస్తుందో చూడు
ఏయ్ ఏయ్ మోటారుకారూ
ఏ◌టే◌టి నీ తొందర
భాయ్ భాయ్ సైక్లిస్ట్
భద్రంసు◌ు ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్ర◌రోధి అహింసావాది శాకాహారి
మద్య నిషేధ ప్రజ్ఞాశాలి
నగరం నడి◌ీధిలో
నాగరికత గమనాన్ని నిరోధిస్తూ
ఇలా యెంతసేపయినా సరే
ఈ యెద్దు నిలబడగలదు

ఎద్దుకి లేకపోతే బుద్ధి
మనిషి కేనా ఉండొద్దా?

## అధివాస్త◌కుల ప్రదేశం

కాసరమా ◌కారములు కార్చకు పూసరమా మసారపున్
రాసులలో కపాలములు రాల్చకు తావళమా ◌షాదపున్

వేసములో కుశాసనము పేర్చకు రాసభమా సమాధిలో
◌ిసము పెంచి ఆ తొడల ◌ిద నటించకు పుణ్యమయ్యెడున్

నిచ్చెన పచ్చి నెత్తురులు నింపి నిలింపుల దుంపత్రెంపి కా
ర్చిచ్చులు త్రచ్చుకొన్నది శచీపతి పీచు◌ితాయి వేటలో
పచ్చిక మచ్చికైనది క్షపాకర భీకర సూకరాకృతుల్
పిచ్చిదనాలుపోయిరి కబీరుసు త్రాగిన రోషనారలై

ప్రాతాది సూదికన్న పొరపాటున తా తెరచాటు వేసి ఘో
షా తిలకించబోయి వెదజల్లును గుమ్మడి పూదుమారముల్
లేతది రా◌ంకొమ్ము పడలేదు భయానక దందశూక ని
ర్ఘాత పతాక దానికొరకై యిరుకైన◌ం సందులెందుకో
గంధముగా మెడన్ పులుముగా తలపోయుదు వంధకారపున్
బంధకి యూర్చు జాలి చనుబాలను గాలము వేచి లాగుచున్
సింధువు పిల్చెనా పరిహసించెడు సైగల ? సుప్తశోణ పా
ణింధమ ఖడ్గధార హవణించకు◌ు తిలకాష్ఠ వహ్నిలోన్
◌్రంగి తి◌ంగిలాంగల త◌ుస్రగుహాంతర ◌ినమేష పా
రంగతులైన బొంగురములార యెరింగిన తెల్పుడా పరి
షంగము పాడుటెందుకు ? ◌పంచికి కంచికి దూరమెంత ? వ
డ్రంగుల రంగులా గులకరాళ్ళగు మా గుడిలోని లింగముల్ ?

ఉద్యమ నాయకా చదువుకో: ◌నిపించని కంచుకాగడా
వాద్యములన్ నిశానిశిత వల్లరి అల్లరి యల్లికన్ సము
త్పాద్య సుధావృథావ్యథలు భాషకులొంగని భావశాఖలో
చోద్యము లూహలో మలుపు చూడ్కులు నీతలముస్క కాస్క లై

కైకొని కాకికన్ను కలకాలపు చూపులు రెక్క రిక్క పై
పైకొని మేకుతాకిడికి ప్రాణము హాయి బజారు జారుడై
డాకయికై కడాని పగడాల గుడారములో ◌డాకులై
రోకలి రోదనాకులంత రోదసినిండిన రోగభోగమై

మౌనము శంఖమై చెరగుమాయగ నేత్రపతంగ బింబ ని
ధ్యానము కొంగనెత్తురులు త్రాగెడు నల్లతురాయి పూపుగా
వేసలిపై అవే అయిదువేల కుశీర కుతార దారుణ
ప్రాణ శిలీంధ్రముల్ తిరుగుబాటు తుపాకి తుఫాను కానుపుల్

వచ్చెడు ఫల్గుణుడు వార్ధితరంగ మృదంగ ఘోషలో
◌చ్చెడు మచ్చునుందు పల◌ంచెడు కించి దుషస్తుషారముల్
పచ్చిక మచ్చికై నది ప్రపంచపు నెత్తురు మంటపాటలన్
మెచ్చనివాడ నీ మెడల◌ంద నివే ఉదయాద్రి రౌద్రముల్

## మహాక◌ ఆశ్చర్యం

సూది కొసవలె సూక్ష్మ మైన ఒక లోకం. నా ఆలోచన అయస్కాంతం. అణువులో ఆలాపన , కలంలో కలకలం. అణాలో ఆల్కౌ◌ు . ఆరాధనలో ఆముదం. జింటాన్ నన్ను ంటానంది. రత్నాలు 9. రసాలు 9. ఆకాశనేత్రంలో అష్టాదశ పురాణాలు. ఇంద్రధనుస్సు వాయిస్తూ ఎవరో పాడుతున్నారు ప్రవాళ దీపంలో మరకతమంజీరం కాబోలును ?

ఆంబోతులు

మరచిపోయి చూచిన◌ , చూచి మరచిపోయిన◌, అనుకొని ఆలకించిన◌. ఆలకించినట్టు అనుకున్న◌, ఆకస్మికంగా ఆఘ్రూణించిన◌, రుచిచూచి రచించిన◌, స్పృశించి అనుభ◌ంచిన◌, రమ్మంటే రావు, వొద్దన్నావొస్తాయి. నాటకశాలలో గురకపెడుతూ, జంతు ప్రదర్శనశాలలో పియానో వాయిస్తూ, వస్తు ◌క్రయ శాలలో వేణ్ణీళ్ళు తాగుతూ బ్రిడ్జి ప్రక్క పిల్లిమొగ్గలు వేస్తూ , లాడ్జిలో కూరగాయలు కోస్తూ ఎప్పుడో వస్తాయి, ఎలాగో చూస్తాయి.

కెమేరాకన్ను

చంద్రకిరణాలనే శాశతంగా తాగలేము. సందులో వుంది సాహసం. జడవనివదు సౌందర్యం. సరదా కొసని కొరడా కొసని సరదా కొసని కొరడా. నా ఇష్టం వచ్చినంత రాస్తాను. ఎక్కడ ఆగానో ఎరుగుదును. అధరం నా ఆదర్శం బింబంలో ప్రతిబింబం.

హం
మో దం
సం

కూర్చొని చేసిన పాపం గుడికట్టినా పోదు. చిన్నప్పటిమాట. ఆడపిల్ల బడిలో అటెండెన్స్ రిజిస్టరు తస్కరించిన తరాత చేతిలోపని చేతిలోనే అయిపోయింది. “అన్నన్నా, ఎంతపని చేశానా” అనుకున్నాను. కొన్ని సంపాదకీయ రచనలకంటె నయమే అనిపిస్తుం దిప్పుడు.

క్రైమా - చేసిరి

పిల్లి తాగుతూన్న పాలలాగు బాధతో పడుక్కున్నాను. కొన్ని రూళ్ళ కర్రలు , వాటికొక దారం కట్టి లాగుతూ పందికొక్కు లాంటి పొడుంగొక్కు వస్తోంది. సీసాలు తే. పసుపుపచ్చని పత్రికలు కట్టుకుని పెళ్ళికూతురయింది వాస్తంకత.

శారదాబిల్లి

ఛందస్సు (గాయత్రీ సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటే ఒరుగుతుంది. ధానంలో కారం - మాత్రలు ంగడం నాకు చేతకాదు. అల్లిక రంగ వల్లిక , అంకెలు మన సంకెళ్ళు. ఆడగవయ్యా ఆర్థికశాస్త్ర పండితుణ్ణి. పరతం పండి బద్దలవుతోంది, లావా ----

దే

శ్రావణ శుద్ధ దశ సోమవారం మెడంద అవతరాలు కప్పుకొని చంద్రుడు తొంగిచూశాడు. బడబానలంవలె భయంకర మనోహరమైన పయోధి . అదృష్టంవలె, అఘంవలె, నౌకాభంగంవలె, నగ్ననక్షత్రంవలె, నలు చదరపు నీలిమందు అందులోనిది తింగలం. దానికొక ఔత్ఖానా, దంతాలసందున కార్ఖానా.

ఔరత్‌ఖానా

జరత్కారుని చమత్కారంలాగు నన్ను నేను తిరగేసి తొడుక్కున్నాను.
అడుగునుంచి చూస్తే అస్థిపరతం ;
అగ్నిపంజరం, ందనుంచి చూస్తే మేగ్నా కేసు; ంరట్ కార్టా.
అర్థంకాదు ఆలాపన - అయితే - అబద్ధంకాదు ఆశ్చర్యం.

మహారాజశ్రీ

కళ్ళ పిడికిళ్ళలో కర్పూర నీహారం ధరించి, ఉపమానం వంటి ఉల్కా గైవేయంతో కనీనికాధిష్ఠిత కాళిదాసుడై, ప్రబంధగ్రంథ గంధగజాన్ని అధిరోహించి ఆకస్మాత్తుగా సాక్షాత్కరించాడు మహాకం ఆశ్చర్యం.

అతివా (! ! ! !)

రానేవచ్చావు ఎలాగూ, కళ్ళతోనయినా ఒకమాట ఆడుదూ - లాల్చీ ప్పేస్తానన్నాను. బహిరంగ రహస్యాలు బయటపెట్టడాని కేమున్నాయి ? అందరూ అనుకుంటున్నవే. తలలలో దాచుకుంటారు. కలలలో కరవొస్తాయి. అన్నీ నాకు 64 లాగే కనబడటాయ్. పరధ్యానంగా ఉన్నప్పుడు అర్థమవుతాయి.

ఆల్కెంరా

అన్నిటిలో అందం వుంది. అర్థం వుంది. కావలసినన్ని ఉపమానాలకి అక్కరలేనన్ని ఉపమేయాలు, ఎక్కడో పోలిక దొరుకుతుంది. ఎక్కడో చేతులు కలుస్తాయి. స్నేహం చేపడుతుంది. ఇంద్రనీల మణులను కరిగించి ఎవరో సముద్రాన్ని సృష్టించారన్నవేవే. ఆ మాట రుజువు చెయ్యగలవా ? కార్మిక ఘర్మ కఠోరక్షారతలో కడలికి రూపం కలిగిందని నేనంటేనా కోపం ? అదో దృక్పథం. అదో చిత్తవృత్తి, ఆ స్థితిలో అన్నీ క్షమిస్తావు. అన్నీ రుచిస్తాయి.

దృక్కోణం

సప్నాలను కోస్తున్నాడు శస్త్రవైద్యుడు... లలో , మేఘాలలో... యలలో , లోయలలో ఉన్నా ఉంటాయి. పోయినా పోతాయి. నీకెందుకు బాధ ? బా.....ధ బా.... అబ్బా......బా....బా, బా, బా, బాం, బాం, బాంబు.